శ్రీఈశ్వరదేవతాయైనమః



శ్రీ

# శ్రీరామలింగేశ్వరశతకము

చెళ్లపిళ్ల వెంకటేశ్వరకవిచే

రచింపబడెను.

కానూరగ్రహారం

కు తాలూకా, పశ్చిమగోదావరిజిల్లా.

మొదటికూర్పు 1000 ప్రతులు.

వంగూరి హనుమంతరావుగారిచే

శారదాముద్రాశాలాన్ముద్రితము

తణుకు

1935

వెల 2 అణాలు.



# కృతజ్ఞత

ఉ॥ మాపినతాతగారికిగు ♦ మారుడువిజ్ఞుడు సోమాయాజినా
యావనికెంతోసంతసిలి ♦ యిచ్చనునచ్చునకైన ద్రవ్యమున్
లోపము సేయ కేకులము ♦ లోగలవన్నను బైటబెట్టగా
లోపలనెంచిగూర్చెబెను ♦ లోభులు మోముల ధఃకరింపగన్.



శుభమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః




1 శా॥ వేదంబుల్ స్మృతులుం బురాణములునీ ♦ విశ్వంబు సర్వంబునీ
గాథల్ వర్ణనసేయ లేమనినదు ♦ ష్కర్ముండ? పాపుండనే
నో దేవా? జడబుద్ధినే మెఱుగుదున్ ♦ యుష్మద్గుణానీకమున్
శ్రీదైవారగ వర్ణనంబు సలుపన్ ♦ శ్రీరామలింగేశ్వరా

2 శా॥ శ్రీమద్రావ్యనగాధివాస హిమభూ ♦ భృత్కన్యకాలోల యో
సోమాదిత్యహుతాశనాంబక సుర ♦ స్తోమార్చితా నిన్మదిన్
నేమంబొప్పగ భక్తిఁ గొల్చు జనుఁడే ♦ నిర్వాణరాజ్యోన్నత
శ్రీనుంచుండని నొక్కి పల్కరె బుధుల్ ♦ శ్రీరామలింగేశ్వరా

3 శా॥ కాకుల్ పేర్లుచు కాలముం గడపగా ♦ గాక్షింతుగా నీమదిన్
గోరంతైనను నీదు సేవసలుపన్ ♦ గోరంగ బోనెట్టులీ
నేరస్తుండరితాత్ము బ్రోతువొ దయన్ ♦ నీవాడనన్ బ్రోవగా
భారంబంతయు నీదమ్మిలను దే ♦ వా రామలింగేశ్వరా

4 శా॥ మరితాత్ముండను దుష్టబుద్ధిని మహా ♦ దుర్మార్గుడన్ గ్రూరుడన్
భరమైతో చెడునాదు జీవనమున ♦ న్బాధించెదో బ్రోచెదో
వరదా నాదగు భారమంతయును నీ ♦ పై మోపియున్నాడనీ
చరణాబ్జంబుల వంటెనాదు మనమీ ♦ శ్రీ రామలింగేశ్వరా

5 మ తెలివింజెందినదాది నిత్రినుసుష ♦ ప్తింజెందునందాక నా
తలపుల్పాపయుతంబులందునొకటిం ♦ దర్కింపపుణ్యాస్పదం
బులవంబుంగనరాదునన్ను నెటులం ♦ బోషింతువో మృత్యువుం
దలపన్భీతియగున్మనంబున మహా ♦ త్మా రామలింగేశ్వరా

6 మ జననంబందిన ప్రాణులన్నిటికిచ ♦ ర్చంజేయగానెవ్వడో
వనమందో జలమందొ సద్మమునవో ♦ వచ్చుంగదా మృత్యువం
చును గాలుండదయుండటంచెరిగియున్ ♦ సుంతైననీ పాదసే
వనముంజేసితరింపబోరకటదే ♦ వా రామలింగేశ్వరా

7 మ సుతులంచున్ధనమంచు దారయనుచుం ♦ జుట్టాలటంచున్సదా
మతిమోహించుచుదంభముల్వలుకుచున్ ♦ మాయాతిరోధానులై
గతియాపంతయు నెంచబోరకడుపే ♦ కైలాసమన్పల్కుదు
ర్మతిమంతుల్గలరిందుకొందరుమహా ♦ త్మారామలింగేశ్వరా

8 మ జడలన్బెంచినభూతిదాల్చిననద ♦ స్నానంబులన్ సల్పినన్
దడబాటొందక వేదముల్జదివినన్ ♦ దంభంబుక్రోధంబునుర్
జడతన్వీడకసత్ప్రవర్తనమునుర్ ♦ శాంతంబునున్గల్గినీ
యుడుగుల్గల్గకరాదుమోక్షపదము ♦ య్యారామలింగేశ్వరా

9 శా కాశీనాథునిజూడనేగినమహా ♦ కాళేశ్వరుంగాచినన్
శ్రీశైలేశుభజించినన్గొలచినన్ ♦ శేషాచలాధీశ్వరు
న్నాశన్వీడిభవమ్మురోసిమదిలో ♦ నాత్మున్నినున్గొల్వకే
శ్రీశారాధితమోక్షమందగలరే ♦ శ్రీరామలింగేశ్వరా

10 శా సారాయింగొనిమాంసమున్దినిదురా ♦ చారుండునై చోరుడై
జారుండై చలరేగు భ్రష్టుడునుదా ♦ శాంతాత్ముడై నీపద
శ్రీరాజీవయుగంబునొక్కపరిలో ♦ జేర్పంబునీతాత్ముడై
శ్రీరామార్చితనిన్ను జెందునటయో ♦ శ్రీరామలింగేశ్వరా

11 శా కాంతంబుత్రిలనర్ధమున్విడచివన్ ♦ గాంతారమున్జేరియే
కాంతావాసమునిశ్చయించిననొగిం ♦ గామాదులన్గెల్చిని
శ్చింతన్నీదుపదమ్ములంగొలువకే ♦ చేకూరదమ్మోక్షమా
వంతైనన్శ్రితకల్పభూరుహమదే ♦ వారామలింగేశ్వరా

12 శా పాపంబంచునుబుణ్యమంచునెదలో ♦ భావింపకావంతయున్
ఏవున్మీరిశఠుండనై తిరిగియే ♦ నిన్నాళ్లునీమీదనా
పాపంబుల్వారియించిమోక్షమిడనీ ♦ పాదంబెదిక్కంచునో
శ్రీపత్యర్చితనీపదానబడితిన్ ♦ శ్రీరామలింగేశ్వరా

13 మ ధనదుండిష్టసఖుండు ధేనువునుజిం ♦ తారత్నమున్గల్పకం
బునునొప్పారెడుమేరుభూధరముబల్ ♦ మోదంపుజేవిల్లుశ్రీ
వనితానాథుడుపాదసేవకుడహో ♦ స్వామీనమస్తావనిన్
నినుబోల్వేలుపుగాననొసయెచటే ♦ నినా్రమలింగేశ్వరా

14 శా ధనువామేరువువాసమారజితభూ ♦ ధ్రిమ్మృభిరాట్కన్యకా
నినుసేవించెదుభక్తురాలయిననీ ♦ నేమంబదేమోసతం
బునుబిచ్చంబును నెత్తుదంటఫణుల ♦ నొమ్మదంబునన్దాల్తువం
టనయుంబుణావలకాటనుండెదవటా ♦ హా రామలింగేశ్వరా

15 కడిమింగాలుని క్రొవ్వడంచియనిలో ♦ కంబెల్లశ్లాఘింపనా
బుడుతండౌమునిరాట్తనూభవునకున్ ♦ బాల్యాందదీర్ఘాయు
విడినావంటశ్రితాళులన్ప్రియముమై ♦ యీరీతిగాపాడగా
మృడనీకున్సరివేలుపెవ్వరిలనో ♦ శ్రీరామలింగేశ్వరా

16 మ సిరిసంపత్తులగూర్పగా గలుగుజే ♦ జేలున్నచోనుండవ
చ్చరయంగామృతిలేనిజీవనమునీ ♦ యంజాలువేల్పుల్భువిన్
బరిశీలింప ద్వధన్యులొందుగలరే ♦ భావింపమృత్యుంజయా
ఖ్యరహించాలిచిమృత్యుభీతినుడపం ♦ గారామలింగేశ్వరా

17 శా ఆలుంబిడ్డలునేడ్వసాగకషవా ♦ తాబద్ధకంఠంబుతో
నేలాపైచినకాలుచేతులటులే ♦ యీక్షింపగన్పట్టున
ప్పేలానిన్నుభజింతుగానవిపుడే ♦ యిచ్చెన్భవత్పాదముల్
ఫాలంజింటగభక్తిమ్రొక్కెదనుదే ♦ వారామలింగేశ్వరా

18 శా కొంపల్కాలెడువేళనీరమునకై ♦ కూపంబులన్త్రవ్వగా
బంపుల్వెట్టగజూచుమూర్ఖునటుల ♦ న్వాతాదిరోగాళిచే
దెంపుల్లేకయబాధనొందునపుడీ ♦ దేహంబుతోనిన్నున
ర్చింపంజూచినలాభమేమికలదో ♦ శ్రీరామలింగేశ్వరా

19 మ మాడతల్లోమునగానకుండునపుడే ♦ మోహాంబునైగాంతలున్
గడినేపైననువీడనప్పాడెకను ♦ ల్కాన్పించునప్రేమనం
బెడనీనప్పాడెదండమూతగానన ♦ ప్పేనీదుపాదంబులన్
మృడసేవించెడువాడెధన్యుడగునో ♦ శ్రీరామలింగేశ్వరా

20 మ సిరులందూగెడునాడుధర్మమునుదా ♦ జేయంగయత్నింపకా
సిరిబోనేడ్చినవానిచాద్చునతను ♦ శ్రీబోనియున్నాళ్లనీ
చరణాబ్జంబులుగొల్వనేరకటుపై ♦ జాయాసుతుల్ రోయగా
గరమున్మొఱదేడ్చునీయెఱుకలే ♦ కనా్రమలింగేశ్వరా

21 శా అన్నాకన్నులఁకల్వలంగెలుచుమో ♦ మబ్జారినింగేరుమే
నెన్నఁగారంగుమెఱుంగునేలగలదో ♦ యీయిట్టిమాతమ్మునిన్
బిన్నన్నాయ మఱూచిపట్టుగొనిపి ♦ ప్పింజేసియామీఁదటఁ
గన్నుల్గానకయుండునట్లొనరిచెం ♦ గారామలింగేశ్వరా

22 మ జనకుండెంతయుబిన్ననాడెసురభూ ♦ స్వామింగనంబోవనా
యనుజన్నన్నునుబెంచిపెద్దలగజే ♦ యంజాలితానట్టిమా
జనయిత్రీమణిపుల్లమాంబయమితో ♦ త్స్నేహంబుమైయుండసీ
కనులున్గట్టెనెకట్టపెట్టనకలం ♦ కారామలింగేశ్వరా

23 మ యెటుమాతమ్మునిబ్రోతువోకనులనీ ♦ వింపొందగానిచ్చినీ
వెటుమాతల్లికినంతసంబిడెదవో ♦ యేరీతినాకన్నులం
బటుమోదాంబుకణంబులంగరపెదో ♦ భద్రంబులన్గూర్పవ
న్నిటదిక్కేవయటంచునమ్మితినితం ♦ డ్రీరామలింగేశ్వరా

24 మ కనలోకంబులనెల్లసేయునటుపై ♦ గారుణ్యమేపారగా
బెనుపన్నీదలయంబొనర్పవిధివి ♦ ష్ణ్వీశాఖ్యలందాల్చిపెం
పునవేతృత్వమునూనివెల్గునినునం ♦ పూర్ణున్నిరాకారునో
వనజాక్షార్చితగొల్తునెమ్మదినిదే ♦ వారామలింగేశ్వరా

35 మ ధనహీనుల్ తమపొట్టకై పుడమిలో ♦ దాస్యమ్మునుం జేసినన్
ధనవంతుల్ తమపొట్టకున్ జరుగకే ♦ దాస్యమ్మునూహింతురే
కనగాగారణమేదొ యుండదగురా ♦ కాచంద్రశుభ్రాంగ వే
గనికారమ్మున జెప్ప వేడెదను చ ♦ క్కన్ రామలింగేశ్వరా

36 మ కలికాలంబని యుందువా యదియునుం ♦ గాదందువా వీరిప్రా
క్ఫలమే యిట్లు ఫలించెనంచ నెదవా ♦ వల్కంగ బో వద్దియున్
శిలరూపంబవ నిర్దయాపరుడవా ♦ చెప్పంగనం దేవ మా
చలమా మారువచింపనీకు జగధీ ♦ శా రామలింగేశ్వరా

37 శా ఏదేనుత్తరమీయకుంట తగునా ♦ యీరీతి నీవున్నచో
వేదాలా స్మృతులా పురాణములయే ♦ విద్వాంసునో జేరిత
త్పాదాలంబడి సంగ్రహింపనికనీ ♦ శక్యందిగందాత్రివిబల్
మోదంబీదగు ముద్దువల్కులనుశం ♦ భూ రామలింగేశ్వరా

38 మ నిగమార్థమ్ము లెరింగి వైదికులులా ♦ నీకమ్ము శ్లాఘింపగా
నిగమోక్తంబగు కర్మకాండము మహా ♦ నిష్ఠన్సదా సల్పియో
జగధీశా భవదీయ పాదములని ♦ చ్చంగొల్చి శుద్ధాత్ముడై
జగతిన్ జోగవధాని పేరుగనెనీ ♦ శా రామలింగేశ్వరా

39 శా ఆపుణ్యాత్ముని పెద్దబిడ్డను బుధా ♦ హ్లాదక్రియాలోలువుం
డేపాపమ్ము నెరుంగ డుత్తముడు మ ♦ మ్మేపాద్రు సంప్రీతిమై
కాపాడుంగద మత్పితామహుడు వీ ♦ కన్ వేంకటేశాఖ్యుడో
పాపారణ్యకుఠార నీలగళ దే ♦ వా రామలింగేశ్వరా

40. శా. తాతంబోలె గుణాలనీతడని వి ◆ ద్వాంసుల్ నుతింపంగ వి
ఖ్యాతిన్ వైదికవిద్యలంబడసె జో ◆ గయ్యాహ్వయుండాతనిన్
మాతండ్రిం దనపట్టబెట్టుకొనె న◆న్యాయంబుగా మృత్యువో
దైతేయార్పిత సర్వబంధువులు ◆ గుందన్ రామలింగేశ్వరా

41 శా. అన్నా వత్తును ముందునీవరుగుమా ◆ యన్నట్లు సోదర్యునిన్
వెన్నాడెన్బినతండ్రియున్మదకలవ్ ◆ పెందుఃఖవారాసి నే
తెన్నుంజూపక ద్రోసివైచి యతడున్ ◆ ధీమంతుడేయైననే
మన్నా వేంకటరామయాఖ్యుడుమహా ◆ త్మా రామలింగేశ్వరా

42 మ. తనకున్ రెండవపుత్రుడైదనరు వే ◆ దాధ్యేతనాగావధా
న్యనువానిం బినతండ్రికిచ్చె సుతుగా ◆ నాహేతువన్ పుత్రసం
తునుగోల్పోయెనుమత్పితామహుడుశు◆ద్ధుండార్యసంపూజ్యుడా
యనకే జన్మపు బాపమిట్లొసగెన ◆య్యా రామలింగేశ్వరా

43 సీ. పూర్వార్జితంబైన ◆ భూమి సుంతయులేక
పోయిన మాతాత ◆ పొల్పుమీర
పదిమందికిడిమేము ◆ ముదమొందగాగల్గు
మాన్యంబుపెట్టిన ◆ మాన్యుడెలమి
వేంకటేశాఖ్యుడు ◆ వేదవిదగ్రణి
మాతండ్రిపోయిన ◆ మమ్ముదాను
గన్నసంతానమ్ముకైవడి ◆ సంప్రీతి
గనుగొనిబోచిన ◆ కరుణశాలి

గీ పతికి నెదురాడనేరని ♦ పరమసాధ్వి
మత్పితామహి లక్ష్మమ్మ ♦ మాన్యచరిత
వీరిరుణమును దీర్పనే ♦ నేరుతునొకొ
రామలింగేశ రజతాద్రి ♦ రాజవాస

46 మ తనయుల్ వోయినగాని మమ్ముదమ సం ♦ తానమ్ముగాబ్రీతిమై
గనుచుం బెండిలిమున్ను కార్యముల జ ♦ క్కంజేసిమామీదనే
గనులంబెట్టుకయున్న వృద్ధులను వీ ♦ కన్విడి మానాయన
మ్మను దాతన్ పరవాసమొప్పితి మహాత్మా ♦ రామలింగేశ్వరా

47 మ తనచేతంగలభూమినంతయునుసా ♦ తంత్ర్యమ్మునావంతయున్
మనమందెన్నకవ్రాసియిచ్చినమహా♦మాన్యుండుమాతాతయా
యనలో పంబిసుమంత లేదయిననా ♦ యాకర్మమే మోసివా
మనమొప్పెన్పరదేశవాసము మహాత్మా ♦ రామలింగేశ్వరా

48 మ కుడువంబట్టకుకూడులేదొ ముడువ ♦ న్గోచీయు గాన్పింపదో
కడుపున్ జేతలనూని నెమ్మనమున ♦ న్గానంత సందేహమున్
బడకేరివ్వన స్వస్థలమ్ము విడి పో ♦ వన్నీకునెట్లొప్పెరా
బడవాయంచు జివాట్లు పెట్టదగు దే ♦ వా రామలింగేశ్వరా

49 మ నిలువన్నీడయు లేనివానియటుల ♦ న్నీవిట్లు గ్రామాంతరం
బుల నేలాబడిపోవనెంచితివిరా ♦ పుణ్యాత్ముల న్బెద్దలన్
దలపంబోకయు నీపితామహుల పం ♦ దాయంచు నన్నిట్టగా
దలచీ పందియుమంద నీకగున శ్రీ ♦ దా రామలింగేశ్వరా

50 శా పట్టెండబ్బిన నిండుపొట్టకిటు సం ♦ వానమ్ము దూరమ్మగా
వెట్టంజూచి సహింపనీకుదగునా ♦ బిడ్డల్ పరావానమున్
మెట్టందండ్రి జగానన్నొప్పగలడే ♦ మేమింతబర్వైతిమే
కట్టా సర్వజగంబులందునకలం ♦ కా రామలింగేశ్వరా

51 శా కట్టం బట్టయులేక చర్మమునునే ♦ గట్టంగ భైక్షమ్ము చే
నెట్టోపొట్టనుబోయుచుండ ననునీ ♦ వీరీతిబొక్కించుటల్
కట్టా నాయమెయంచు బల్కకేటులో ♦ గన్పట్టినీముష్టిలో
బట్టెండేసిన నీకులోప మెుకో దే ♦ వా రామలింగేశ్వరా

52 శా నాకేలేకనుముష్టి నెత్తుకొనగా ♦ నన్నిట్టులం జీకగా
నీకుంజెల్లునెయంచు బల్కకుము నా ♦ నీకోసమీ వేయెటో
వీకన్నింకొక రెండువీధులను నా ♦ వీటందగంజూచి న
న్నాకున్ నీకునుగూడ జాలుగద ర ♦ న్నా రామలింగేశ్వరా

53 మ నాకన్నన్ సిరిగల్గువాడెవడురా ♦ నన్నిట్టులన్ జుల్కనన్
లేకీమాటలుబల్కుచుంటి భళి యీ ♦ లీలన్ సరేయంచొంగిన్
గాకంజెందగ నేనుతాళగలనా ♦ కాసీభపద్దానులన్
శ్రీకంఠా కనిపెట్టకుంటదగునా ♦ శ్రీ రామలింగేశ్వరా

54 శా పసిడిక్ వెండియుగొండలంగలిగి నీ ♦ పారబ్ధమాకాటిలో
మసిమేనందిగబూసి ముష్టికరుగ ♦ న్మాకండ్రి యేముండినన్
బసలేదించుకయైనలోభికని వి ♦ శ్వంబందు జాట్టింపగా
దెసిలాంగా మసిముష్టులంగొనుట ధా ♦ త్రినా రామలింగేశ్వరా

53 మ ధనముండైనను వానియబ్బయయునన్ ♦ ధర్మమ్ము లేకున్నచో
వనధిం ద్రొబ్బిన నగ్నిలోఁ బరచిన ♦ న్వ్యర్థింపగాఁబోదురే
గుణవంతుల్ రహిసత్సభాస్థలిని సం ♦ కోచంబు నీకేలనో
మునిభక్తాంగణకల్పభూమిరుహ శం ♦ భూ రామలింగేశ్వరా

54 మ వనజాక్షుండు వికుంఠలక్ష్మి సురభూ ♦ పాలుండు స్వర్లోకము
న్వనజోద్భూతుడు సత్యలోకమును ది ♦ క్పాలుర్దిగంతమ్ములం
జనలోకంబును దక్షరాజులు భవ ♦ త్సంపూజనల్జేసినీ
యనురాగంబునగాచె యేలిరన వ ♦ య్యా రామలింగేశ్వరా

55 మ పలుకుల్నేర్చిననేరకున్న గవిత ♦ న్వ్రాయంగ నుబ్బాటలం
గలముంబట్టితినేడు నీదయమదిం ♦ గాంక్షించి పేరాసమై
దలఁబూవం గవికోటి మెచ్చగబుధుల్ ♦ తజ్జ్ఞుల్ప్రమోదాంబుధిం
జలకంబాడ రచించుశక్తినిడు మీ ♦ శా రామలింగేశ్వరా

56 శా ధారాశుద్ధియు ధారణాబలమునోం ♦ దంజేసి పెన్నాపకే
ధారాశంబుగ వ్రాయుశక్తినిడి వా ♦ గ్ధాటింబ్రసాదించి ద్రా
క్షారంభాపరిపాకమొప్పుగృతులం ♦ గల్పింపనెన్నెన్నియో
మారారీ చతురత్వమీగదె మహా ♦ త్మా రామలింగేశ్వరా

57 మ పుడమిం బావనపుట్టువుంబడయుటం ♦ బూర్వాపరప్రక్రియన్
వడిసేయుంపగ నేర్చితిన్నడవితి ♦ న్బ్రాజ్ఞుంగులాచారముం
గడుభక్తిన్నినుగొల్చుచుంటిగవితా ♦ కన్యార్థినై ప్రీతితో
నెడనీకింగవితాకుమారినిడవో ♦ యీ రామలింగేశ్వరా

8 మ తడవావంతయు నేయబోక కవితా ♦ తన్వంగి తానంతనే
వడిజిత్రమ్ముల జూపగా వలయునా ♦ ప్రాజ్ఞుల్ప్రమోదాంబుధిం
బడియాదన్వాలె నొడ్డగానక నృపుల్ ♦ ల్భక్తిప్రపూర్ణాత్ములై
మృదపాదమ్ముల వ్రాలగా వలయు నో ♦ శ్రీరామలింగేశ్వరా

59 మ పలుకుంబల్కున దేనియల్ చిలుకగా ♦ బల్కంగనత్యాశువుం
బలుకంజేతొ శతావధానసరణిం ♦ ప్రాచీనులంబోలన
న్శైలిమిన్నిల్పవదొ చిత్రబంధకవితా ♦ శ్రీగూర్చి విద్వత్కవీం
ద్రులు మెచ్చంగను జేతొ యేమొసగ నిం ♦ తో రామలింగేశ్వరా

60 శా ధారాళమ్మగు నాకవిత్వము ధరా ♦ దారావతంసమ్ముగా
నీరూపమ్మున నీగుణావళులనే ♦ నేజెప్పగా జేసి ని
స్సారంబైన నరాంకితేచ్ఛ మదితా ♦ సంత్రైన దోపింపకో
శ్రీరామార్చిత రెంట సౌఖ్యమిడుమీ ♦ శ్రీరామలింగేశ్వరా

61 శా పదివేల్పండితులున్న నిండుసభలో ♦ బ్రజ్ఞన్వధానాశువున్
మదినావంతయు జంకులేక జగతి ♦ న్మాన్యుల్ప్రశంసింపగా
విదితంబుంబొనరించు కోర్కెమదిలో ♦ వేమారునుంగల్గునా
యదనుంగూరిచి సత్ప్రతిష్ఠనిడుమ ♦ న్నా రామలింగేశ్వరా

మ కనగాపూర్వ కవీంద్రులందరును నీ ♦ కారుణ్యముంజేసిగా
ఘనులై మన్ననుమిన్ననుం దమయశః ♦ కాంతావిహారావనిం
బొనరించెందడ వేల నన్నునటులే ♦ బోషింపగా వేడితిన్
వినవేమన్నని బ్రోవవేలొ వినుట ను ♦ ర్వినా రామలింగేశ్వరా

63 మ తవయుర్నేర్చిన నేరకున్న జగతిం ♦ దథ్యమ్ముగాదండిరి పే
రున నైనంగురుభావముంచెడరొగిన్ ♦ రూపించియావీడట
న్మనుమల్లాతను బోలకున్నయెడ నం ♦ మ్మానింపగాబోకు నీ
మనుమండన్గులకీర్తి నిల్వగను గా ♦ మ్మా రామలింగేశ్వరా

64 శా సంతానమ్మునుగన్నకొద్దిహరాయులు ♦ న్సంప్రీతియుంగల్గిలో
నెంతోకోరికమెప్పుసేయవలెదా ♦ నన్నెన్నొకొంగొత్తలం
జింతింపన్వలె జూపగావలెను నూ ♦ చిత్తంబుదళొత్తధీ
మంతుల్గాల్వగవిత్వ కన్యకమహా ♦ త్మా రామలింగేశ్వరా

65 మ వినినన్వీనులకింపునింపవలయు ♦ న్విన్నంతనేబోకతా
నును జేబట్టిపఠింపగావలయుదా ♦ నుంజూచి యావీడటన్
దనవారింబఠియింపజేయవలెమీ ♦ దంగూడనాకావ్యమే
కనులంగట్టినయట్టులుండవలె చ ♦ క్కనారామలింగేశ్వరా

66 శా ఏపద్యమ్ముబఠింపనెంచినను నా ♦ యీపద్యమేవాక్కునన్
జూపట్టన్వలె నెమ్మదిన్నతమదే ♦ శోధింపగానెంచిదా
నాపద్యార్థమెరింగి యొండొరులతో ♦ నత్యంతమున్బ్రీతిమై
రేపున్మాపుబఠింపనెంచవలెనో ♦ శ్రీరామలింగేశ్వరా

67 మ యతియుంబ్రాసముఛందముంగనగనా ♦ యాసమ్మునాకీయకే
మతిమాత్రిమ్మెటొదిప్పియట్టులనున ♦ మ్మానమ్మునేనందగా
మతిమంతుల్దలలూప నానందులుగా ♦ మాట్లాడ నీకొవ్వనో
శితికంఠా తమసేవకుండగుట నో ♦ శ్రీరామలింగేశ్వరా

68 మ కవనంబెందుకు రాయుటంచు బలుకం ◆ గారాదుయేమందువా
కవనంబేగద దర్పణంబుప్రుడమిం ◆ గన్గొంటకన్నింటికిన్
కవనంబేగద లేకపోవునెడ నీ ◆ కల్యాణచారిత్రముల్
భువిలోనెట్టుల విశ్రుతంబులగు శ ◆ మ్యూభారామలింగేశ్వరా

69 శా శ్రీనాథాదికవీంద్రులట్టు కవితా ◆ శ్రీనాథులై ధాత్రిలో
నానారాజకిరీటహార విలస ◆ న్నవ్యార్చ్యలెవ్వాని పా
దానంగ్రాలునతండెగా సుకవియా ◆ తండే సమస్తోర్వి స
మ్మానింపందగుపుణ్యమూర్తియుమహా ◆ త్మా రామలింగేశ్వరా

70 మ ధనమున్నప్పుడుదారబంధువులు ద ◆ ద్దంబ్రీతి గావింతురా
ధనముంగోల్పడనౌకరుంగనునటుల్ ◆ దాక్షిణ్య హీనాత్ములై
గనువారల్ మునువెన్కలంగనక ని ◆ క్కంబిద్దియాధాత్రిలో
ధనమేగాదె గుణాస్పదంబుగన శ్రీ ◆ దా రామలింగేశ్వరా

71 శా తాతందల్లినితండ్రినిన్మరియున ◆ త్తన్మామనాత్మేశ్వరుం
బూతుల్దిట్టినగొట్టినన్పరులతో ◆ బోవంగదానెంచివన్
జేతంనాత్రిల్లుపదున్నసింగియునుదా ◆ సింగమ్మగారౌనుగా
నేతద్ధాత్రినివర్తమానమునసో ◆ యీ రామలింగేశ్వరా

72 మ గడపంబచ్చనజేసి తోరణమునే ◆ గట్టంగగుమ్మమ్మునన్
వడివార్చన్వలె గోనెబియ్యమును నా ◆ బాంధవ్య మేతెంచినం
గడకాలంబున నేమిగానియిలు డౌ ◆ క్కండైన హానాదు త
మ్ముడు బాధంబడజూడరాడుగద శ ◆ మ్యూభారామలింగేశ్వరా

73 మ తడిగోడంగని కాలుదుర్వ్వ వృషభో♦ ద్దామమ్ము చందమ్మునన్
మడిబట్టల్ తడిగుడ్డలాసనములు ♦ న్నాకందలేదంచునుం
గడయుంచున్మోదలంచుమధ్యయనుచుం♦ గ్రార్కమ్మునం గేరుయీ
వెడగుల్బందుగులొక్కొ_కానగనును ♦ ర్విన్ రామలింగేశ్వరా

74 మ కనగాకష్టపుకాలమందెవడు వీ ♦ కంజేరియోదార్చితా
నునుకష్టంబుసహించియున్నను ల న♦ న్యానానురాగంబుతో
నౌవరింపంగలవాడొ వాడెగదయా ♦ యుర్వీస్థలిం బంధుత
న్మనమీయందగుబంధుమాన్యుడుమహా♦త్మారామలింగేశ్వరా

75 గీ శ్రీయుతుడు చిరంజీవి సు♦ శీలుడరయ
నాదుమేనత్తకొమరుడు ♦ మోదమెసగ
ధరనునరసింహమనుపేర ♦ దనరువాడు
రామలింగేశ రజితాద్రి ♦ రాజవాస

76 మ వరుసన్మేనమరందియై సఖుడునై ♦ వాత్సల్యతన్ గార్యముల్
గరవన్సోదరుడై యనేకవిధులం ♦ గన్పట్టిమాతమ్ముని
న్వరుసవ్వత్సర మన్నపానముల సం ♦ భావించి హిందీకళా
ర్థరహావ్యమ్మునెరుంగజేసి పరిశు ♦ ద్ధా రామలింగేశ్వరా

77 మ తణుకుంగ్రామములోనగానతనస ♦ద్మంబందునన్ స్ఫోటకం
బనురోగంబునబాధలంబడెడు నా ♦యాత్మీయసోదర్యునిం
దనసోదర్యునికై వడింగనుచు సం ♦దర్భానుసారమ్ముగా
నువనంబోదుగయోందువెన్క_యునుము♦ న్నారామలింగేశ్వరా

78 మ కనులన్మూయక నొక్కరాత్రియును నా ♦ కన్నన్గడించిప్రియ
మ్మునుజాగ్రత్తయుగల్గికాచియును మ♦ మ్ముం ధైర్యముం గూర్చు
దనతోడం భజియింపజేయుచును న ♦ ర్ధంబింత లెక్కింపకిం [చో
వునమాపద్వ్రతయమ్మునుం గరపె శం ♦ భూ రామలింగేశ్వరా

79 మ కడుచిన్నప్పుడు మాగృహమ్మునను పీ ♦ కన్బాలతో నేతి మీ
గడలన్నన్నును మించితిన్నఫలమీ ♦ కాలంబునంజూపె నీ
తడునాతమ్ముని స్ఫోటకమ్మునను దా ♦ దాతృత్వతాశ్రుత్వముల్
నడపెన్భ్రాతృత నెంత యోగ్యుడొ గద ♦ న్నా రామలింగేశ్వరా

80 మ నరసింహాఖ్యుని నాదుమేనమరది ♦ న్నా ప్రాణతుల్యుంధరా
ధరముల్ జక్కలు సోముడున్ప్రియు వే ♦ దంబుల్ ధరామండలిం
గరమున్ వెల్గెడి యున్నినాళ్లు సిరులం ♦ గల్పించి సంపత్తుల
న్మూరిపెంబొప్పగ బ్రోవవేడదను శం ♦ భూ రామలింగేశ్వరా

81 మ ఇతనింబెంచినతల్లి యెంతటిమహా ♦ యిల్లాలొ సుబ్బమ్మయుం
మతినూహింపగ నెంతొ ప్రేమమున మా ♦ మాతన్దిగద్రావిడా
సుతుకన్నం బదిరెట్లు లెక్కవగ నా ♦ సోదర్యునింజూచె నా
సతికీడౌ సతి యాపెధాత్రిగన నీ ♦ శా రామలింగేశ్వరా

82 మ మలపాకాన్వయవార్ధిశీతకరు నా ♦ మంత్రింపధన్వంతరీ
నిలయున్ శ్రీకరు రామమూర్తి నటుపై ♦ నిర్వ్యాజవుంబ్రీతిపై
లలిదావచ్చియుమందులిచ్చెనుగదా ♦ లాలించి యేమిచ్చి వా
రలకష్టంబును దీర్పజాలుదును శ ♦ ర్వా రామలింగేశ్వరా

83 శా పాపంబాయెన బావగారొకడు మా ♦ వానిన్గనన్వచ్చి యీ
రూపంబెన్నడు దానుగానమియలో ♦ లోభీతినేమాత్రిపై
యాపాదించక మెట్టామందునిడిదా ♦ నాపైని రెన్నాళ్లదా
కా పాపంబాడలేమెరుంగ డకలం ♦ కా రామలింగేశ్వరా

84 శా మావానింగనెనన్న కారణము న ♦ న్కల్పాకవంశేందువున్
లావుందక్కక స్ఫోటకంబునకుగా ♦ లంబిచ్చికొన్నాళ్లునా
భావంబెంతయు గుర్తెరింగినను న ♦ ద్భావంబునంజూచె
ద్భావుండాతని నన్నునాకగున దే ♦ వా రామలింగేశ్వరా

85 మ ఇనుడెవ్వాని దయన్వెలుంగు శశిదా ♦ నెవ్వానికారుణ్యముం
గనిమించున్గ్రహరాజి తారకములున్ ♦ గన్పట్టు నెవ్వానియా
జ్ఞనువీచున్పవనమ్ము వహ్నియును ను ♦ ష్ణత్వమ్మునుంగాంచునిం
పునవానిన్ముబరాత్పరుందలతు శ ♦ మ్భూ రామలింగేశ్వరా

86 మ పలువైద్యంబుల బాగుకానిరుజలుం ♦ బాగందుసన్మాలికా
లలితాఖ్యంబనరారువైద్యమున చా ♦ లామంచిదా వైద్యమం
చెలమింబెద్దలు చెప్పుచుందురుగదా ♦ నీచేయువారీధరా
స్థలినెవ్వారును గానరారుగద శ్రీ ♦ దా రామలింగేశ్వరా

87 శా కొండల్మాలికలుండుచోటులని లో ♦ కుల్లెవ్వగా వింటినే
కొండేగాదె భవన్నివాసమును నా ♦ కొండందునేమాలికే
గండంబుంగడదేర్పగాగలదొ బా ♦ గా జూచివైద్యుండవై
దండంనిల్పి కరమ్ముబ్రోవగదె శ్రీ ♦ దా రామలింగేశ్వరా

88 శా కొండల్కొద్ది సువర్ణరాశ్యములు నీ ♦ కుండంగ నేమిచ్చిని
న్దండితున్నని సేయమంచు నిరుపే ♦ దన్నేను సద్భక్తినే
వం డోపత్రిము నీరమోయిదుదుదా ♦ వన్మాత్రిసంతోషివై
బండాభాయవుగాక బోవగదె దే ♦ వా రామలింగేశ్వరా

89 మ ధనమిమ్మంచును నన్నుగోరనెడ పే ♦ దన్నేను నీకీయగా
మణులామాడలరూకలా కనకమా ♦ మాన్యమ్ములాసొమ్ములా
కననేవీగనరావు నాకడను వీ ♦ కన్నిన్ను సేవింపనా
మనమున్వాక్కునుకాయమిచ్చెదమహా ♦ త్మారామలింగేశ్వరా

90 మ మనమున్వాక్కునుగాయమిత్తునని భీ ♦ మా గారహింబల్కనా
మనమున్వాక్కునుగాయమెవ్వరివిరా ♦ మా సొమ్ము మాకిచ్చుటే
ఘనమాయంచువచింపరాదరయనే ♦ కాలమ్ములోఖాడ వే
ఘనులేరూకకు బేడనీయుట కలం ♦ కా రామలింగేశ్వరా

91 శా నీవాసర్వవిధాల బూజ్యుడవెగా ♦ నీ నిన్ను బూజింపనా
భావంబెంతయు నిచ్ఛగించియును నా ♦ పాపంబదేమో మదిం
భాపింపన్గడెయైననిశ్చలత గ ♦ న్పట్టంగబోచెట్టులే
భావింపంగలవాడనో దెలుపు దే ♦ వా రామలింగేశ్వరా

92 మ చనియెన్మాసములేదు నేటికిని వీ ♦ సం బైనను న్జూవులో
ఘనమేమీగనరాదు డాక్టరులు నిం ♦ కాజూడుడంచేదొ నీ
టినినేత్రిమ్ములవోయనెంచెదరు నే ♦ టీపుల్గనన్నారు త
మ్మునికన్నుల్గన నేడ్పువచ్చెడిని క ♦ మ్మాభ రామలింగేశ్వరా

93 మ పరదేశమ్ముల వైద్యులంగురిచి బో ♦ వన్వారిబత్రెమ్ముకే
కరవైయుంతుట దూరదేశముల కే ♦ గన్జాలకున్నాడనే
కరణింబ్రోతువా నాదుసోదరుని నీ ♦ గారుణ్యముంగోరితిం
భరమాసర్వము బ్రోచువానికిది దే ♦ వా రామలింగేశ్వరా

94 శా లేవేమందులు లేవెయౌషధులు నీ ♦ లీలల్గదా సర్వమో
భావాతీత భవత్కటాక్షములకే ♦ బాత్రుండనుంగాన నా
లేవన్నీవయెఱుంగవేయనజానే ♦ లీలన్మదాపూరితుం
గావింతోగద దృష్టులింపునెసగం ♦ గనాత్రిమలింగేశ్వరా

95 మ కరుణాశీలుడు భక్తవత్సలుడు శ్రీ ♦ కంఠుండె ముల్లోకముల్
బరిశీలించిననంచునిన్నుసుబుధుల్ ♦ వాక్రుచ్చగావింటినీ
చరణాబ్జంబులనమ్మియుంటిమదినీ ♦ శాకష్టముల్బాపగా
దరుణంబియ్యదెబ్రోవవేదయనుశ్రీ ♦ దా రామలింగేశ్వరా

96 శా కన్నల్గాననివానిజీవనములో ♦ కంబందువ్యర్థమ్మటం
చెన్నంగాబడుమాటలీవెరుగవా ♦ యిన్నాళ్లుమాతమ్ముడుం
గన్నుల్పక్కగగానకుంటెరుగవా ♦ గానంగనీకాతడో
యన్నాలాతియ నీదుపుత్రుడుగద ♦ య్యా రామలింగేశ్వరా

97 మ తనయుండైనను దుర్గుణుండయినబా ♦ ధన్వొందుటేనాయమా
ననియోచించుటకైన దుర్గుణముగా ♦ ననాత్రమ రవ్వతయున్
గనుగోబోవు గుణాలవాలు దనయు ♦ న్గారిన్యముంబూననీ
మన మెట్లొప్పనొదోచకున్నది మహా ♦ త్మా రామలింగేశ్వరా

98 మ నిలవావంతయుగాన రాదు ఋణమా ♦ నత్తైక్క నూహింపగా
బాలమాన్వల్పముసోదరుండుదనచూ♦పుల్లోక్కంచమున్నట్టులన్
దెలుపున్మాయమశూచి మూలమునసో ♦ దేవాథ రామండలిం
జలమానన్నిటి బాధలంబరు పనీ ♦ శ్రీరామలింగేశ్వరా

99 శా నీకారాముమువల్ల కాడగుటనే ♦ నిన్నున్నదాగొల్చుటన్
నాకున్నిత్యము కాటిలోపనియె వి ♦ న్నాణంబుగా నెంచితే
కాకున్నన్మధురోక్తులన్గవనము ♦ న్గల్పించునేర్పుండియున్
శ్రీకంఠా యిటులుంటకేమొ తెలియన్ ♦ శ్రీరామలింగేశ్వరా

100 శా గోచీవెట్టినదాది నేటివరకున్ ♦ గోటీశ్వరుండైననే
గోచీవెట్టియెఱుంగ జిత్తమనుచు ♦ న్గోరంగబోనవ్వనిన్
నీచిత్తంబని నాదుప్రాప్తమనుచు ♦ నిన్నేగదా నమ్మితిన్
నాచిత్తంబును నీవెఱుంగుదుగద ♦ న్నా రామలింగేశ్వరా

101 శా నాచిత్తంబును నీవెరింగియును నా ♦ నాబాధలంబెట్టగా
నీచిత్తంబెటులొప్పెరా వరదుడా ♦ నేనేమిపైవాడనా
నీచిత్తంబెటులున్నగాని వినుమీ ♦ నిక్కమ్ము ముమ్మాటికిన్
నాచిత్తంబున నిన్నువీడనుగద ♦ న్నా రామలింగేశ్వరా

102 శా దారాపుత్రులపోషణార్థ మిసుమం ♦ తైనన్మదింగోరగా
నేరంగాని మదీయసోదరునకున్ నేత్రాంధతన్మాన్పవే
సారుల్జెప్పక నాకుదప్పదదివి ♦ శ్వాసమ్ము మైసేయనో
మారారీ మరినీకుదప్పదు మహా ♦ త్మా రామలింగేశ్వరా

103 మ ఇలలో బిడ్డలు చిక్కులంబడగ తం ♦ డ్రితన్నుగానట్టులం
తలపన్లోకులు సాయమాదురోకా మా ♦ తప్పేమి మేమిట్టులం
సిలుగుల్బొందగ జూచియూరకొనగా ♦ జేజేతులన్నీవు మ
మ్ముల కష్టంబులపాలు సేయుటకుశ ♦ మ్యా రామలింగేశ్వరా

104 మ తనయుల్ తప్పులు జేసినన్ జనకుడీ ♦ ధాత్రిస్థలిం బెద్దగా
మనమందెంచినవాడొకండు గలడే ♦ మా కర్మమా లేకనీ
గొన మేయట్టిద నీదు పుత్రుడిపుడ ♦ త్యుల్కొంచవు స్తూవుల
న్గనగా జూచి సహింపజొచ్చిత కలం ♦ కా రామలింగేశ్వరా

105 మ తనయుండెగ్గుల బెక్కు సల్పినను గో్ర ♦ ధంబూనిదాబిడ్డని
న్గనులంగానక కష్టముల్ల్బడునెడం ♦ గాపాడగాబోక పి
ల్పినమాట్లాడక దారుణమ్ముగ ధరన్ ♦ శిక్షించినంతోషము
న్గనుతండొక్కడ గానరాడు గగనం ♦ గా రామలింగేశ్వరా

106 మ చెడుగై నన్నన బిడ్డనెప్పుడును దా ♦ శిక్షింపగాబోడొక
ప్పుడు శిక్షించినగాని యెప్పుడును ద ♦ ప్పాల్సేయకుండంగనే
గడెయోగంటయొబుద్ధివచ్చునటు ♦ నూత్న్మమ్మెదాగావించునో
మృడకానీ యిటు సేయనిష్టపడునా ♦ శ్రీరామలింగేశ్వరా

107 శా యేదో చేసితివింతమట్టుకు నికే ♦ నేదోయుపాయమ్మునన్
భేదంబింతయు లేకనీదు తనయున్ ♦ బిన్నన్మదీయానుజుం
బేదన్గన్నుల బాగుగానొసగి సం ♦ ప్రీతిన్మదంబిచ్చియో
శ్రీదా బ్రోవుము రామచంద్రునినాగస్ ♦ శ్రీ రామలింగేశ్వరా

108 మ చిఱుతండుత్తముడార్యసమ్మతుడు మా ♦ చిన్నారిసోదర్యుఁడో
కరుణాసాగర రామచంద్రుఁడు భవ ♦ త్కారుణ్యముంగోరి నీ
చరణాబ్జమ్ములబట్టి నేడితనికిన్ ♦ సంప్రీతిమైగన్నుల
న్గరుణంన్గూరిచి వేగఁబ్రోవదగు జ ♦ క్కన్రామలింగేశ్వరా

109 శా శ్రీసపన్నమునీగుణోత్కరమునీ ♦ శీలమ్ము శ్రేయమ్ము నీ
వాసమ్ముత్తమమానిహ్మన్నిలయమా ♦ బ్రహ్మంతవాడెంతో పే
రానన్బద్ధగనీవిశేషములహా ♦ యంబూనివీసమ్ములో
నాసన్వీడిననాకునేర్పుగలద ♦ య్యారామలింగేశ్వరా

110 శా నీరూపమ్మునునీగుణోత్కరముల ♦ న్నీచైత్యములంజెప్పగా
నారంభంబొనరించుటెట్టిదనజా ♦ త్యంధుండుసీతాంశునిం
పారస్వర్శనసేయబూనుటయుచే ♦ బారీతనొడ్డెక్కగా
పారావా మునందుజొచ్చుటయుదే ♦ వారామలింగేశ్వరా

111 మ ఘుసవాశిష్ఠనదీతటమ్మునబుధా ♦ గారమ్మునై నెమ్మినీ
వనివంశేందువునారసింహాఖ్యబుధుల్ ♦ వహ్యాయనంజేయబె
న్వాను శ్రీయమ్ములకిక్కయైజగతిశా ♦ నూరగ్రహారమ్మునా
జనుగ్రామంబుగనీకునాకునెలవీ ♦ శారామలింగేశ్వరా

112 మ కనుకన్వారికులమ్ముసంపదలదూ ♦ గంజేసియెక్కాలము
న్మానయూరంగలసర్వవర్ణములున ♦ న్మార్గానురక్తాత్ములై
మనగాశ్రీలకునాటపట్టగుచుబే ♦ మన్జూచిపోషించియిం
పునమాజేయుసపర్యలంగొనుముశ ♦ మ్భూ రామలింగేశ్వరా

113 మ ధరణిస్థాఖిలరాజపూజితనుపా ♦ జాబ్జాతుడౌ వెంకటే
శ్వరవిద్వత్కవిరాజశిష్యుడనుశ్వ ♦ శ్వద్భక్తి నెల్లప్పునీ
చరణాబ్జంబులగొల్చువాడ నెదనీ ♦ శాచెళ్లపిళ్లాన్వయా
భరణంబాపిన వెంకటేశ్వరుడదే ♦ వారామలింగేశ్వరా

114 మ మృడనీపాదసరోజయుగ్మము మదిన్ ♦ శ్రీమీర నవ్వాడుదా
గడుభక్తిన్నిలుపంగ నేర్చునో భవ ♦ త్కారుణ్యమాతండెగా
బడయన్నేర్చును సర్వసంపదల కా ♦ వాసంబునై వెల్గునే
కడజాతిజ్జనియించినజ్జనుడు చ ♦ చక్కనా్రమలింగేశ్వరా

115 మ మణులున్మాడలురూకలున్గనకమున్ ♦ మాన్యబులున్సొమ్ములున్
గనగానన్నియు నస్థిరమ్ములని బా ♦ గాజూచినీపేరుతో
ననవద్యమ్ములు శాశ్వతమ్ములును ప ♦ ద్మాక్ష్యన్రహిన్మించునీ
మ.ఖలంగూర్చితికాన్కవెట్టగమహా ♦ త్మా రామలింగేశ్వరా

116 శా నామీదందయయుంచినాయనుజుడ ♦ వ్వంచింతసొంతమ్ముగా
ధీమంతుల్వొగడంగ దెచ్చుకొనసీ ♦ దివ్యౌషధవాత్రిమున్
నేమంబొప్పగగూర్చి కన్నులిడమీ ♦ నేనేయుసత్కారమో
స్వామీనూటపదారులందుకొను మీ ♦ శారామలింగేశ్వరా



శ్రీమద్ధన్వంతరయేనమః

# అశోక

ఈ ఔషధరాజము స్త్రీల గర్భాశయ, ఆర్తవ, ప్రదర (కుసుమ) వ్యాధులకు అమృతమువంటిది అమితఋతురక్తస్రావమును నిర్మూలించును వాడువిధానము మందుతో పంపబడును.

ఔన్సుసీసా 1కి రు 0—8—0

వలయువారు ఈక్రిందివిలాసమునకు వ్రాయుడు.

## పి. ఆర్. మూర్తి. అండ్. కో.

శ్రీగోపాలకృష్ణాయుర్వేదనిలయము

శాకరపర్రు, తణుకు తాలూకా, ప. గోదావరి.

ప్రొప్రైటర్సు } పి. ఆర్. మూర్తి.
ఆయుర్వేదవిశారద } పి. యస్. మూర్తి.

—:o:—

# శ్రీకామేశ్వరీఆయుర్వేదనిలయం

ఖండవల్లి, తణుకుతాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా.

ఈనిలయమునందు సమస్తదీర్ఘవ్యాధులకు అన్ని జాతులసుఖ వ్యాధులకుగ్యారంటీగా చికిత్స చేయుచు శాస్త్రోక్తముగాతయారైన దివ్యౌషధములు న్యాయమైన ఖరీదులకువిక్రయించబడును.

శాకరపర్తి కామేశ్వరావు,
(వైద్యరాజ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి ప్రియశిష్యుడు)
చికిత్సకులు.